అస్మద్గురుభ్యోనమః





హరివిలాసము

# గణోదయము.

అను

# శిలాపనిందానివారణము



ఇది

శ్రీగోదావరిడిస్ట్రిక్టు రామచంద్రపురము తాలూకా కొమ్మగ్రా
వాస్తవ్యులును, ఆశ్వలాయన సూత్రులును కాశ్యప గో
త్రులును, "అభినవ పోతరాజ" బిరుదాంకితులును

అగు

శ్రీమాన్ "చిలకమర్తి నారాయణకవి" వరులచే

రచియింపఁబడి

యేతత్పూనులగు

శ్రీమాన్ "చిలకమర్తి నరసింహాచార్యులు" వారిచే

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు, 500.

COCANADA:

Printed by B. C. Surya Row, at the
Saraswati Printing Press.

 1913. [వెల 4 అణాలు.

అస్మద్గురుభ్యోనమః.

(హరివిలాసము)

# గణోదయము

అను

## నీలాపనిందానివారణము

ఇది

శ్రీగోదావరిడిస్ట్రిక్టు రామచంద్రపురము తాలూకా
కొమరపురివాస్తవ్యులును, ఆశ్వలాయన సూత్రులును,
కాశ్యప సగోత్రులును,
"అభినవ పోతరాజ" బిరుదాంకితులును;
అగు
శ్రీమాన్ "చిలకమర్తి నారాయణ కవి" వరులచే
రచియింపఁబడి

యేతత్సూనులగు
శ్రీమాన్ "చిలకమర్తి నరసింహాచార్యుల" వారిచే
ముద్రింపించి ప్రకటింపఁబడియె.

(మొదటికూర్పు ౫౦౦ ప్రతులు.)

COCANADA:

PRINTED BY B. C. SURYAROW AT

THE SARASWATI PRESS.

1913



[దీనివెల 4 అణాలు.

# పీ ఠి క.

---

## చిలకమర్తి నారాయణాచార్యులవారు.

వీరు శ్రీవైష్ణవులు. 19 వ శతాబ్దములోనివారు. గోదావరిజిల్లా, రామచంద్రపురముతాలూకా, కొమరిపాలెపువాస్తవ్యులు, శ్రీమాన్ పల్లేరుమూడి వెంకటాచార్యులవారియొద్ద విద్యాభ్యాసముచేసి, గీర్వాణాంధ్ర సాహిత్యము, ఉభయభాషాకవనము, స్వరపదవర్ణ కవిత్వము, జ్యౌతిషము, వైద్యము, ఉభయవేదాంతజ్ఞానము, మొదలగునేక విషయములలోఁ బాండిత్యము సంపాదించినట్లు తమగ్రంధములయందు వ్రాసియున్నారు. వీరు (1) గణోదయప్రబంధము (2) భాగవత దశమస్కంధ పూర్వభాగమంతయు, యక్షగానము, (3) శ్రీవేణుగోపబాలశతకము, చక్కఁగా స్వభావోక్తి ననుసరించి సరస, మృదు మధురశైలిని నిరర్గళధారగా వ్రాసినారు. (1) (3) గ్రంధములు కొమరిపాలెపు శ్రీవేణుగోపాలస్వామివారికిని, (2) గ్రంధము ఆయన అత్తవారిస్థలమగుతణుకుతాలూకా దువ్వగోపాల స్వామివారికి నంకితముచేసిరి. యమకకవిత్వము వీరిసొమ్మైనట్లు పైగ్రంధములేతార్కాణములు. వీరు "అభినవపోతరాజ" బిరుదాంకితులు. 'కీరవటనారాయణసూరి' యని గ్రంధములలో తమపేరు వ్రాయుటకలదు. వీరుసంచారకవులు. అందందువీరువినినక్రొత్త దేశీయపదముల నక్కడక్కడ తమకవిత్వములోఁజేర్చిరి. వీరుతమ గ్రంధములను జదువునపుడుఅమృతముకురిపించి, పూలజల్లులుచిలికించి జనులనానందమగ్నులఁ జేసిరను వాడుకకలదు. వీరికనేక విషయములలో గొప్పలోకానుభవమున్నట్లు' వీరువ్రాసిన గ్రంధములవలనస్పష్టమగుచున్నది. వీరు చాటుధార లనేకములు రచించియుండిరి. వానిలోఁదమ పొలమునందు 'తృణరాజి' మెండుగానున్నదని యధికారులతోఁ జెప్పు సందర్భములో నీక్రింది 'చాటుధార' ను జదివిరి.

### తృణరాజిసీసమాలిక.

అమడతుత్తురు బెండ ♦ యత్తిపత్తి గునుకు ♦ గాడిదెగడపరి ♦ కాణి వేప  
యుత్తరెంక దూసరి ♦ యులిశ పావలి యుప్పి ♦ యారుగ పెదచిప్ప ♦ కారుగెచ్చ  
గాంధారి చినచిప్ప ♦ కాకిచిప్ప గరికె ♦ రెల్లు చెంగలి దర్భ ♦ తెల్లయూద  
పిప్పలి యొబిళింత ♦ పిల్లిపీచర గుంట ♦ కర్ణ చేలపురి పా ♦ గాకు జొడె  
కోడిబుడమ యలక ♦ జీడి కాసరి నల్ల ♦ యూద కడిమి చిట్టె ♦ యుత్తరేణి

తుంగ బోడసరంబు ♦ లింగమిరము నార ♦ తుంగ పర్పాటక ♦ దూగుబెండ
బొడ్డుకడిమి కోల ♦ బొమ్మి బరగడమ్ము ♦ చిగిలింత జీలుగు ♦ చీకునువ్వ
వెన్న వెదురుగాద ♦ పొన్నగంటేనుగు ♦ మోకాలు విటుమంగి ♦ ముళ్ళకాడ
శాక విష్ణుకాంత ♦ చంచలి పల్లేరు ♦ తుమ్మి గరకు ముళ్ళ ♦ తోటకూర
పావలి చలితుంగ ♦ పాతలింగమిరంబు ♦ చిట్టింత పేరింత ♦ పిట్టగరికి
గన్నేరు చెంగలి ♦ కవివేము నువ్వుచెం ♦ గలి తీగపాలచెం ♦ గలి సుగంధి
గసగసపాపిట నకరి ♦ కొజ్జి పిచికిబీర ♦ గొలియ చెరి మామిడి ♦ గోళ్లగొంటి
గంధితగరము రు ♦ దజడనడము మద ♦ నబుడత రెడ్డారి ♦ వానుబాలు
చల్లకవ్వంబు కు ♦ శల శాకతుంగ దిం ♦ డిలపురుగుడు నుమం ♦ గలపుకాడ
నేలజెం డుప్పి చి ♦ ర్నేంజిల్లెడు మెట్ట ♦ తూట గ్గివేండ్రంబు ♦ దూలగొండ
నేతా డీశ్వర ♦ నిదగన్నిక పతా ♦ నకరినరం ఒల్లి ♦ నకరితోక
దుష్టపు వాకుడు ♦ తొండ మాలెము ఘూస ♦ ముత్తు పులగ వెన్న ♦ ముద్దలాది
బూని తృణరాజి మాపెద ♦ చేనునల మెం । గవులఋనమాన్య మాన్పుమిం గద్దియైన
హితవు భక్తుల కిమవాండ ♦ వీవకావె । కొమరపురిపాల శ్రీ వేణు ♦ గోపబాల.

కవిత్వశైలి తెలియుటకు వీరి గ్రంథములలోని మచ్చుకొన్ని పద్యములిందుఁ బొందు పఱుపఁబడుచున్నవి:—

యక్షగానములో:—

i. గోపికా వస్త్రాపహరణ సందర్భములోనివి :—

సీ. అన్న లారా వీర ♦ లెన్నడైనను మున్ను ♦ కన్నవారా యిది ♦ విన్నవారొ
కన్నెలున్న తముగ ♦ మన్ననగై కొన్న ♦ వన్నె వాకిటి చిన్ని ♦ చిన్ని పొన్న
గున్నల క్రిందను ♦ గొన్నన కై పిన్న ♦ పిన్న వాండై యాడు ♦ చన్న మున్న
మున్నటి విన్నటి ♦ చిన్నవాండీతండు ♦ కన్నన మనలమా ♦ తిన్న కేగ
సన్న సన్నలుగను ♦ వన్నె వన్నె గవచ్చి । యున్న యున్న యాక ♦ పన్న పన్న
యెన్ని యెన్ని నేర్చె ♦ నెన్నెన్ని మనవల్ల । నన్న నెన్న దన్న ♦ మిన్నయాట.

గీ. పలికరువలిని బలుపిల ♦ విలలు చెందె । కిలకిలలు మాని నెలనెల ♦ తెల తెలగని
చెలువులొలికెడి ఒలపగు ♦ పలుకు లలర । గలిమిగ గొల్ల చిలుకల ♦ కొలుకులనిరి.

మద్యపాయులసొమ్ము ♦ మహి నీడిగెలపాలు ♦ జారులధనము త ♦లారిపాలు
గురువులద్రవ్యంబు ♦ కూలిజనులపాలు ♦ సంసారిసొమ్ము వె ♦ చ్చములపాలు
వ్యాధిజనుసొమ్ముపారుగూరి♦వైద్యుపాలు । లుబ్ధునిధనంబుబలిమిదం♦డుగులపాలు
మాధనము గోడమెరక కా ♦ మట్టిపాలు । కొమరపురిపాల శ్రీవేణు ♦ గోపబాల.

## కీర్తనలు.

### రుక్మిణీదేవి గావించిన" అంబాప్రార్థన."

ఆనందభైరవిరాగము ♦ చాపుతాళము.

ఆననా జితేందు బింబ । ఓయంబ । అమిత గుణకదంబ । ఓయంబ॥

౧ వల్లవీచేల చోరుఁడె । ఓయంబ।వాఁడునల్లనీ దేహమువాఁడె॥ ఓయంబ॥
౨ నందతనయుని తోడితెమ్మ ।ఓయంబ। తెచ్చి। నాథునిగఁ జేయవమ్మ॥ ఓయంబ॥
౩ బృందావనవిహారుఁడె । ఓయంబ। వాఁ।డెందుకు నన్నేలుకొనఁడె॥ ఓయంబ॥
౪ దుర్వగోపాల రాయఁడె ।ఓయంబ। వాఁడు।రవ్వకు నోడిగట్టినాఁడె॥ ఓయంబ॥

శంకరాభరణము ♦ అటతాళము.

తెలియఁగలమ । నీదుమాయ॥

౧ హరి నీకడుపులోన ♦ నజ్జాండములఁట ♦ గరిమతో దేవకి ♦ కడుపులోనీవఁట॥ తెలి॥
౨ నలినాక్షునీవాది ♦ నారాయణుఁడ వఁటయా ♦ చెలియగర్భములోన ♦ శిశువైయు న్నావఁట॥ తెలి॥
౩ వనరుహాక్షుఁడ నీవు ♦ వైకుంఠ మిల్లఁట ♦ ఘనమైన మధురాన ♦గరమి ప్పుడిల్లఁట। తె
౪ విశ్వమునకు నీవు ♦ వేరైనావఁట ♦ విశ్వమునలఁపఁగ ♦ వేఱులేదఁటమాయ ॥ తెలి॥
౫ జలజనాభుఁడవఁట ♦ శార్ఙ్గివినీవఁట♦పలుమాఱుదుర్వగో ♦ పాలుఁడవఁటమూడ

కాకినాడ
4-9-1913

ఇట్లు,
కవీశ్వరునిదౌహిత్రుఁడు,
శ్రీవైష్ణవలోకప్రపన్నుఁడు.
సంస్కృతాంధ్ర భాషాభిమాని,
అమరవాది వెంకటాచార్యులు.



# శుద్ధపత్రిక.

---

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 23 | యార్య | మార్య |
| 10 | 24 | గేరేడి | గేరెడి |
| 10 | 27 | కేరసం | కేసరం |
| 11 | 1 | చ్చ్బడి | లిచ్చ్బడి |
| 12 | 3 | గొమ్మ | గొమ్ము |
| 14 | 17 | కుండ వేసె | కుండ నేసె |
| 25 | 20 | బాపి | బాసి |
| 26 | 7 | గలువలు | గలువల |
| 27 | 10 | సంచుద్ర | వంచుద |
| 28 | 20 | యానమన | యానమున |
| 34 | 14 | యొవ్వగ | యొప్పగ |
| 35 | 5 | తవ్వున | తప్పున |
| 40 | 25 | సద్యాదన | స్యందన |
| 41 | 3 | సఁదనందను | నందనందను |
| 42 | 26 | మోద (బున | మోదంబున |
| 45 | 20 | కలినిత | కలిత |
| 46 | 2 | శార్గి | శార్జ్గి |





శ్రీమద్గురుభ్యోనమః.

# గణోదయము.

## ప్రథమాశ్వాసము.

ఉ. వ్రాలని భక్తి మ్రొక్కెదన ♦ వారణ వారణవేళ నాఁటిపి
కీలికి విశ్వసంభరణ ♦ కేలికి దుర్మదదైత్యదానవో
న్మాలికి శాంతశీలికి ప్ర ♦ మోదగుణాలికి భక్తపద్మగో
మాలికిఁ బ్రీతశూలికి సు ♦ మాలికి నవ్వనమాలి కెప్పుడున్. 1

ఉ. రాణదలిర్చు భక్తిని గ ♦ రంబులు మోడ్చెదఁ జారుసైకత
శ్రోణికిఁ జంచరీకచయ ♦ సుందరవేణికిఁ బల్లవప్రభా
పాణికి జంఘికావిజిత ♦ భావజతూణికి దివ్యభూషణ
శ్రేణికిఁ గీరవాణికిఁ బ ♦ రీతదృగేణికి వాణి కెయ్యెడన్. 2

శా. పారాశర్యుని వామలూరుభవునిన్ ♦ బాణున్ మయూరున్ శుకున్
జోరున్ భారవిఁ గాళిదాసుఁ జరణా ♦ ఢ్యున్ మాఘునిన్ నాఘునిన్
ధీరున్ త్ర్యంబకు దండి భోజు భవభూ ♦ తిన్ శంకరున్ మున్నుగా
నారాధించి మదిన్దలంతు సురభా ♦ షాంచత్కవిశ్రేష్ఠులన్. 3

ఉ. నన్నయభట్టు తిక్కకవి ♦ నాచనసోమన పోతరాజు పె
ద్దన్నయుఁ బాండురంగపతి ♦ తాతయ తిమ్మన భాస్కరుండు సూ
రన్నయు నెఱ్ఱయాప్పకవి ♦ రామకవీంద్రులు మొల్ల వీర నా
యన్నవ లోను గాఁగలుగు ♦ నాంధ్రకవీశ్వరకోటి నెంచెదన్. 4

వ. అట్లు గొనియాడి యేనొక్కదినంబునఁ దొవల నేదువాఁడు ప్రాచీశైలోపరిఁ దోఁచు
వేళ లేచి యాచరితాచారుండనై ప్రాచీనకథానుసారంబై భూచక్రంబున సమీచీనం
బుగా నొకచరిత్ర రచింపంజూచి యాధారంబు దొరక మది నాలోచించుచున్నెడ

నోచిన! తపమ్ముగల యాచకులకు ముక్తి నీఁజాలు పద్మలోచను నమగునఁ బుట్టు ఖేట
కీపీవతీ నీచమానవ పాపాపహాగా తెత్తి మోచుకొనెదు మేచకేతరాబ్ధికిం బట్టియ
గు మాచకోరాత్మికిఁ దోఁబుట్టు సితరోచి నే తల నాచుకొనెదు ప్రాగ్నేత సస్తుతా!
నీచాపదాన మారీచాది శిక్షాచణా! వాచాత్యగోచరా! మరీచి స్ఫురన్మణీ రోచమా
న విభూషణా! సూచీముఖోగ్రాగ్రభాగ్రచార! ధీవిజిత వాచస్పతిపరిక్రమ!
భూచార దేవాళికీచకజ్వలన! సద్వీచీ భుజావిక్రమ! యను నుతులఁ బొగ్డిన సా
మి పేరు పాగ్రదర్యగతి వచించె. అట్టిబూచుల యొకిమీనికిం బట్టియయిన పాట్టివేల్పు
చరితము చూచాయగా నాధారంబై దోచ నాదకాచక రచింపఁజాలు నాచేత ని
ట్టి కవితావాచాలత్వం బెట్లు దోచునని యాచియున్నంత. 5

సీ. తనకు లోకము శిశు ♦ త్వంబునఁ గను మేటి, తా దేవకికి శిశు ♦ త్వంబునొందె
సురముఖేంద్రులకగో ♦ చరత జెందెడిసామి, ధరణి గొల్లలకుగో ♦ చరతఁ జెందె
జగములఁ బెంపంగఁ ♦ జాలిన జగజెట్టి, గొల్లలపెంపుచే ♦ నోరెల్లఁబడసె
క్షీరాబ్ధిభవనంబుఁ ♦ జేసెడి బలుమేటి, నందవ్రజము భవ ♦ నంబుఁ జేసెఁ
జుట్టుపలుగొట్టు జెట్టితో ♦ బుట్టుమెట్టు, చుట్టువాలును జేపట్టు ♦ నట్టిదిట్ట
కొమరపాలెపు పురివేణు ♦ గోపబాలుఁ, డట్టినిశినాడు కలను జూ ♦ పట్టెపలికె. 6

సీ. ఆశ్వలాయన సూత్రు ♦ మమరకాశ్యపసగోత్రుఁడవు నారాయణా ♦ ర్యుఁడవు చిలక
మర్తివంశజుఁడవు ♦ మతివాత్స్యవేంకట గురుశిష్యుఁడవు శాస్త్ర ♦ కోవిదుఁడవు!
వేడుకఁ బల్లేరు ♦ మూడివేంకటగురు నొద్దవిద్యాభ్యాస ♦ మొందువాఁడ
వెపుడుమునొల్ల మరపా ♦ లెపుఁబురమునఁ గాపురంబుండుదువు పాప ♦ రహితమతివి
పరిబల తుల్యాజలస్నాన ♦ పానమునను, వెలయుచువువేణు గోపాల ♦ విభునిదయను
గీతికాతగుణాఢ్య మరవాది ♦ కృష్ణమూర్య, సూరిమాత నెందుదువు ♦ దారమతిని. 7

క. ధీరస్వాంత జనార్దన, ధీరవిహృదయంబుఁ దస్త ♦ దేశమునర్చిం
నారాయణరామానుజ, భూరియశః కృష్ణయార్య ♦ పురుషత్రియమున్. 8

క. ఆనారాయణవరునకు, సూనుండు, జనార్దనుండు ♦ శుభగుఁడు పుట్టెన్
మానుగ నమ్మేటికిఁ బెను, సూనుఁడు వేంకటనృసింహ ♦ శుభగుడు పొడమెన్. 9

శా. శాణాదంబున శాణినీయమునుభో ♦ గాఁగల్గుశాస్త్రంబులున్
క్షోణీపాల సభాంతరంబుల మహా ♦ సూరీంద్రులం గెల్చి శత్

క్షోణీపాల సమర్పితాంబరవర • క్షోణీమహాందోళికా
మాణిక్యాది బహూకృతిం బడసి న • మ్మాన్యుండు సామాన్యుఁడే. 10

క. ఆమాన్యునకనుజుఁడవై, సామాన్యంబుగను నీవు • జన్మించితివో
నీమహిమ నీదువిద్యయు, నీమన్నన నీకుసాటి • నీవెయగుసుమీ. 11

చ. సరసపదార్థకల్పనలు • సద్యమకంబులు సాంద్రశబ్ద సుం
దరమహితప్రయోగము ల • నంతమృదూక్తులు శ్లిష్టరూపశ
బ్దరమ లలంక్రియా కలిత • బంధములున్ సురశబ్దసంతతుల్
మఱిమఱి నీకవిత్వమున • మక్కువఁ దామర తంపరై తగున్. 12

తే. త్వన్ముఖోద్గీర్ణయమకశ • బ్దకదనరమ, బాగుసుకొనలేరె యెంతయునై • పుణిసింగంది
రామభాస్కరనాచన • సోమనాది, కవివరులటంచు నావారి • కనుమొలంగె. 13

తే. అత్తఱినిలేచి క్రొత్తయా • యుత్తరంబు, జొత్తిలఁగసంశయంబుల • మొత్తములను
మొత్తియగ్గిత్తతత్తఱి • యుత్తమసుతు, సత్తుఁదళుకొత్తఁ జేయుచు • నుత్సాహమంది

క. ధరవైష్ణవదాస్యంబను, తరిగట్టునఁగవనజలధిఁ • దతబుద్ధిఫణీ
శ్వరుచేఁద్రచ్చి శృంగా, రరసామృతమును సుకవిసు • రలకర్పింతున్. 15

తే. ఆంధ్రసంస్కృతాలంక్రియల్ • యమకతద్భవములు కల్పనల్ శ్లేషప • దములు తత్స
మాసులోకరోకరికి మోద • మూనఁగాన, మత్కృతి వారివారిప్ర • మదమొనర్చు.

—షష్ఠ్యంతములు.—

క. దక్షునకు సితాంభోజద • ళాక్షున కరిశిక్షునకు రమాంబుజనేత్రా
వక్షునకు సర్వభువనా • ధ్యక్షునకుఁ గిరీటిపాలితకటాక్షునకున్. 17

క. నమదాశ్రితలోలునకున్, రమణీయసువర్ణ విస్ఫు • రచ్చేలునకున్
శమితాసురజాలునకున్, గోమరపురీపాల వేణు • గోపాలునకున్. 18

క. రామునకు సతతనుతసు, త్రామునకు సునామునకు వి • దారితవైరి
స్తోమునకు సర్వమంగళ, ధామునకు సుధామునకుఁ బ్ర • ధనభీమునకున్. 19

వ. భక్తియుక్తంబుగా నాయొనర్పంబూను గణోదయ ప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 20

క. విమలాశ్రమముల నెరవై, తుములంబుగఁ బలుకుములకు • దొరలకు నిరవై
కమలాధవాశ్రమంబన, నమరుఁ దపోవనము నైమి • శారణ్యమునన్. 21

తే. రాజహంసాభిరామమై • రాజరాజ, పురమును నభస్స్థలంబును • బోలె వనము
దివ్యవాసనా సుమనఃప్ర • దీప్తమగుచు, దేవపురమన నభయనఁ • దేజరిల్లి. 22

వ. మఱియుఁ దెఱఁగంటుల తెఱవు నొఱసికొను కొమ్ములుగల తరువరమ్ముల యిరవులు మ
రువులుగాఁ జూచుచు మరువిరిశరముల జరుగు గరుసుదురమునఁ బోరిఁబోరి బిరుసుఁదొ
ఱఁగి బిరబిరమరలుకొని వెఱచఱచి కరకరినిమరుశరణంబునఁ దిరుగు తెఱవలతుఱుము
ల నెఱివిరులు మఱిమఱియురుల వీచుచు సగససురసురిన్మనోహర కరివర వరకర శీ
తర్హృత మరునురు గతులఁ దఱలు తరఁగలగములఁ బోరలు సురుచిరశిశిర పరిమళ
భరభరిత సరస్సరసీరుహముల నరమురిఁ దిరిగి తిరిగి యూడుచుఁ జౌఱకు వింటిదొరన్నా
నవెఱికి చుఱుకుచుఱుకు్రు-వఁ బఱపు కఱకు విరిశరములుకమునఁ గరప వరవిరహభర
ఖరతర శరధిగడవఁ దరణి నరయక పరిపరిగతుల తరతరంపు తెరగరపి కరుగుమనము
ల దరిదరికరుగు వెరవరులగు తరుణులకుఁ దిరమగు నాశయంబులు మరుగుపఱచి
మురి దరిగి పొరలి పొరలి వేదనల నొరుగు విరిబోణులనేఁచుచు జిరజిరఁ దిరిగెడి
చిఱుతే కరువలులును వనస్పతి యాగశాలల తిర్యక్శాఖా పీఠంబుల పయినుండి యూ
ర్ధ్వశాఖాయూపంబులు మెఱయ లతాదర్భావృతంబైన మదిజివురు జొంపం బను వే
దికను కావిలేజిగియగ్గిదరికొల్పి పారావత బ్రహ్మల కోకిలాధ్వర్యుల చక్రవాకహో
తల కురువకోద్గాతల యన్యద్విజగణ ఋత్విగ్గణంబుల వాఙ్మంత్రంబులు మొరయఁ
జాంకు పత్రపాత్రిలచే ఫలరసాజ్యంబున నాపాస్రుక్స్రువంబుల ఫలఖండ పశువులనిజ
డింభ దేవతాతృప్తిమొలర్ప మరంద భోజనంబునం దృప్తులై భ్రమరవిప్ర వర్గంబులు
విహరింప వ్రేల్చి సవవిధిమెలంగు శుకయజ్వలు నితరపక్షికులకుల శేఖరాదులతోఁ బ
రివేష్టించు పారావత దైవంబులుగల పున్నాగకురంటకముఖతరు దేవాలయంబులలోఁ
బల్లవప్రభాదీపంబులును బరాగ పరిమళధూపంబులును నానాఫల నివేదన వస్తువులు
ను మధుతీర్థంబుగా మధ్వర్చనాధికారి యర్చాక్రమంబు సలుప నీటనాడి వెడలిన
వైఖరిఁ దరుజొంపంబున వెడలి క్రముక నారికేళ తరు స్తంభంబుల కడ్డంబుగాఁ బ్రాకు
సేమాలవంగలతా కాయమానమంటపంబులవసించి ముఖశైవాలోర్ధ్వపుండ్రంబునలమి
కంఠసీమ సహస్రకమల ధాతువైశరీరారుణిమయను కాషాయవస్త్రంబులుగట్టి నానా
సుమవ్యాప్తభూములను చిత్రాస్తరణంబుల నన్యోన్యాభిముఖాసీనులై ద్రవిడాను సం
ధాన నాందిని నమ్రులై సేవించిన క్రియవాయుగతుల శిరంబులు వంచుచు మున్నడి
పిన్నడిగ వనశ ముందుపలుకుచు జిలిబిలిపలుకులను ద్రవిడంబను సంధించు కురరవై

ష్టవాధ్యాపక గణంబులును ఫలగుచ్ఛక కుంభంబులుగల శాఖాపీఠలపైనున్న బెరడు సారెలపైఁ బ్రాకుఁ గనులతా తంత్రులు స్వబర్హ వాత చలిత శాఖాతాడితంబులై నిజకరంబున మేళనస్వనం బొనరించెనన షడ్జమంబునం బాడు సప్పాటకు ఘణఁలరుదెంచి యనుకూలంబుగామి మఱలు తెమ్మెరలు భీతి నచటి సరసీమధ్యంబునం బ్రవేశింప వారిజ బిసభృంగకోకవారిచరంబులు సహజ సంబంధంబులం దల్లడిల్ల డిండీరహాసంబున సరసీనితంబినీనయువాది సంజ్ఞలఁ దదనుకూల నాట్యంబొనరించెనన స్వాగానాదరీభూత గాంధర్వగానులగు నీలకంఠవైణికులును వనీస్థలంబులు రంగస్థలంబులుగా పికనిస్వానంబులు వైతాళిక గానంబులుగా వంశసుషిర నినాదంబు లుపాంగంబులుగా శకుంతభాషణంబులు తాళఘోషణంబులుగా పతయాళుపాండుపత్రి నిస్వానంబులు మృదంగధ్వానంబులుగా పుష్పిత తరుతతులు సభాపతులుగా తాపింఛకుజనులగమి తమిగా పూలపరాగంబను హరిదంతరజంబున వేషంబులుదాల్చి యరుణ పల్లవ ప్రభలను కరదీపికల వాయుచలితఫలకాంతి గుగ్గులు రజంబు ప్రజ్వరిల్ల లతాయవనికా నిర్గతులై ఘూకపరిహాసకులతోడ నాదగీతంబులు బాడుచు భాగవతంబుజేయు భృంగీ భృంగంబులును, పదక్రియ విరాజితులగు హంసఛందోవేదులును, పంచబాణ రసోత్పాదన చణులగు ఋతుభిషగ్వరులును, ప్రసవఫల సూచకులగు కోకిల దైవజ్ఞులును గలిగి లంకాపురంబు కరణిఁ బుణ్యజనసేవితంబై మానసకాసారంబు భాతి రాజహంసయుతంబై కౌరవాయోధనంబుక్రియ నకులార్జున బాణ కదంబ స్యందనాశ్వకర్ణంబై స్వర్లోకంబు కరణి రంభాసుమనోవృతంబై దిగంతంబు తెఱంగునఁ గుముదపుండరీకంబై కలధౌతాచలంబుక్రియ నీలకంఠ సహితంబై యొప్పి మఱియును. 23

సీ. సారమై బహుళ కా ♦ సారమై చ్యుతకుమా, సారమైధూత సం ♦ సారమగుచుఁ
బుణ్యమై పుష్పితా ♦ రణ్యమై భూరిలా, వణ్యమై యెన్న న ♦ గణ్యమగుచు
భవ్యమై మునిహుత ♦ హవ్యమై ద్విజరాజ, సేవ్యమై సుజన ♦ సంభావ్యమగుచు
రామమై నందనా ♦ రామమై మానీంద్ర, ధామమైవిపినల ♦ లామమగుచు
సకల శుకపిక శారికా ♦ నికరనిలయ, వకుళ మరువక కుంద తిం ♦ దుకకురంట
వికచ కుసుమ రసాశిమ ♦ ధుకరతతుల, చకచకలు గల్గునవ్వని ♦ నికరమునను. 24

సీ॥ తోరమ్ములైనమ ♦ హీరుహమ్ములలోనఁ ♦ జేరికొమ్మలమూరు ♦ గోరికలును
గోరికలకుమీఱి ♦ గోరికలకుమీఱి ♦ సారఫలాదులౌ ♦ కీరములును

కీరమ్ములనుజేరి ♦ చారుపల్లవములఁ ♦ గోరిమెక్కెడిపిక ♦ వారములును
వారమ్ములిగఁగూడి ♦ బైరికలట్లుగా ♦ నూరక నూదుమ ♦ యూరములును

తే. గలిగిపాలుపుగఁ దరువులఁ ♦ గలయులరుల, వలనఁ జిలుకుచుఁ దావుల ♦ కలిమిగలుగు
లలిరజము జిమ్ముగాడ్పుచే ♦ ల్లలకిలయయి, చెలయు నలవనిలోనొక ♦ తలమునందు. 25

తే. కశ్యప వశిష్ఠజమదగ్ని ♦ గౌతమాత్రి, కౌశికవ్యాస శుకశౌన ♦ కకలశభవ
వామదేవాది మునులు దు♦ ర్వారనియతి, నున్నత తపంబొనర్చుచు, ♦ నున్నయెడను.

క. ఘననూతేందుఁడు బొడమెన్ ♦ దనకరనూచనను లోక ♦ తమమణఁచిజనా
ర్దనచరితామృతనిధియై ♦ మునిముదుదధి పొంగినింగి ♦ ముట్టిచెలంగన్.

క. క్రిందటఁ దావకముఖుని ♦ ష్యందహరికథా సుఫలర ♦ సాస్వాదమహా
నందాస్మదృచ్ఛ్రితిశుకవర ♦ బృందము తనివందదిల న ♦ భిమతఫలాప్తిన్. 27

క. ఇందుధరునకై గజాసురుఁ ♦ డొందుకుఁ దపమూనె మడిసె ♦ నెందుకతనిచే
నిందున కందెను నిందన ♦ దెందుకుడిందంగజేసె ♦ నిందుధరుఁడనన్. 28

వ. మఱియు మున్నిటి చిన్నికన్నియ వన్నెలాడగు వెన్నని మన్నసల నున్నతిఁ గాం
చి యున్నంటితిండికాఁడు కన్నుగల మిన్నువాఁకఁ దాల్పు పాపని చిన్నెలుగలయొ
కర్క యెన్నికకథయున్న యది దానినెన్ని పరిపన్నులు భవంబున బన్నంబులు
మీఱి శ్రీశు నున్నత నిలయంబునంజేరఁ గన్న విన్న జనంబు లన్నన్నాయని గేర
తిన్నని సూక్తులఁ బన్నిక్రిన్నన విన్నపంబు జేసెద. 29

తే. పావనాయనతేభాధి ♦ పావనాయ, కారణాయ కృతర్త్విగా ♦ కారణాయ
ధీవరాయ భవాంబుధి ♦ ధీవరాయ, తేన మోస్తని కొనియాడి ♦ ధీరమతిని. 30

వ. చిత్రంబు భూపవిత్రంబు భకలతాలవిత్రంబీ చరిత్రంబు శ్రీదంబు జనతమోభేదంబు
సన్మనోమోదంబు సుజనప్రసాదంబివ్వాదం బాదరంబునవినుండని శుంభత్సంరంభ
విజృంభణాస్తంభ శుభదంభావుక కుంభీనస జంభారి శయాంభోజాక్షపదంభోరు
హాభక్తి సంభావనుండై యిట్లనియె. 31

క. దంతావళి దానవుఁడా ♦ ద్యంతంబులు లేనియంత ♦ కాంతకుని నిజ
స్వాంతమున నునిచి యుతిదు ♦ ర్దాంతంబుగఁ జేసెఁదపమ ♦ తాంతక్రియలన్. 32

క. తనుతను తపోనియతిచే, తనతను వైరితనుశ్రీ ♦ తనుగనరామిన్
దనుకృశశను వంతనొకిం, తనుజెందక తపమునియమి ♦ తనుజేయునెడన్. 33

సీ. ఘోరమ్ములైన మ • యూరారవమ్ములు, వీరకాహళరవో • ద్వృత్తిగాఁగ
ఘోరమ్ములౌ స్తని • తారవమ్ములుమహా, భేరీరవమ్ముల • సౌరుగాఁగ
సారమ్ములౌ జ్వల • ద్వైరమ్మదస్ఫూర్తు, లాయుధీదివియల • బారుగాఁగ
నీరమ్ము నందంగఁ • జేరుచాతకముల, పారమ్ములౌ పరి • వారములుగ
ధారుణీపతి గతిశరా • సారముననను, సారెసారెకు గ్రీష్మారి • పాఱియువతి
సారవక్షోజదుర్గము • దూఱిదాఁగఁ, గాఱుమొగులంబరముబట్టు • మేరయలరె. 34

తే. దట్టమై దిట్టమై శీత • ముట్టిపడియె, మెట్టదొనగట్టు • నంగట్టి వెట్టపుట్టె
నట్టితఱి రక్కసుల కొట్టి • పట్టుమిగిలి, నట్టి బిట్టుతపంబుచే • పట్టియుండ. 35

క. భీమంబై వ్యథితజగత్, స్తోమంబై దిక్సతులకు • సుత్రామమణీ
ధామంబై వీతక్రతు, ధూమంబై తత్తపోగ్ని • ధూమంబలరెన్. 36

వ. మఱియు నీకరణి లోకాలోక దుర్లోకంబై భీకరంబులగు పోకల తపంబు ధాకసోక సోకుమూఁకల వైరులగు పాకశాసనాదు లాకులత్వంబున నేకతంబునఁ జీకాకుపడి శ్రీకరభూపాకర రాకానిశాకర నీకాశాకారాననంబులతో నుత్సేకంబు వదలి వీకస డలి యీకర్బుర తపోగ్ని కాకరాకల నాకంపంబునొంది శోకవ్యాకులంబైన నాక లోకంబునకు నపగత శోకంబొనర్ప నుమాకాంతుండె గాని యన్యలోకేశులకుఁ దరం బేయనిని కామాస్త్రోకమణి ప్రభాకరానేక శ్రీకంబులగు విమానానీకంబులతోఁ బినాక గిరికిం బోవ సమకట్టి. 37

క. ముంగిటఁ గాంచిరి కలుషవి, భంగన్ మృదుపవనచలిత • బహుళతరంగన్
సంగీతస్వనభృంగన్, గంగన్ సరసీరుహప్ర • కలితరథాంగన్. 38

సీ. అచ్ఛంబు భక్తితోఁ • గ్రుచ్చిన నతిజేసి, తచ్చరితము విని • వచ్చి సురలు
మచ్చికల్ నచ్చిన • నెచ్చెలిపిండుతో, ముచ్చటగములచే • హెచ్చిహెచ్చి
బొచ్చంపుఁ దమకము • లిచ్చలింపఁగఁ గడు, నిచ్ఛలంబగు నీటఁ • జొచ్చి చొచ్చి
పెచ్చుగఁ బెరిగెడి • మచ్ఛరంబుననందు, విచ్చలవిడి కేళిఁ • బుచ్చిబుచ్చి
బుచ్చి బుచ్చగుకరువలి • మెచ్చిమెచ్చి, మెచ్చువచ్చిన నాళముల్ • వ్రచ్చివ్రచ్చి
యచ్చెరువు దోఁపఁ జనువిచ్చి • యుచ్ఛదనరు, నచ్చరలకచ్చుకొను వేడ్క • లచ్చుపడఁగ.

క. దరులన్ కింపురుష కృశో, దరులన్ గుసుమితములైన • దరులన్ ముని మం
దరులన్ ధృతభవభక్త్యా, దరులన్ గిరులన్ మహాస • దరులన్ గనుచున్. 40

క. కరమమర నరిగి రమితల, హరికిర్చ్ఛనభక్తభవమ ♦ హాంబుధితరికిన్
 వరహరికి స్మాజితసుర, పురికిన్నదవిహ్యాత కరికిఁ ♦ బురహరగిరికిన్. 41

వ. ఇవ్విధంబునం జని. 42

ఉ. వాడిశమేచువాహనయి ♦ వాడని మేనును గల్గినట్టి యు
 న్నాఁడు మహాతపంబు గొని ♦ నాఁడు గజాసురుఁడన్న పేరు గ
 న్నాఁడు భవత్ప్రసిద్ధి విని ♦ నాఁడు గదా యిఁక నాడునాడు న
 వ్వాడితపంబుచే మునులు ♦ వాడికి పోడిమి వీడిరేమనన్. 43

క. రమ్మా మనుఁగన నోర్వఁద, రమ్మాయిత్తపము గనుభ ♦ రమ్మా మానే
 రమ్మా త్రొల్లిటి ఘనవై, రమ్మాయెత్తంగగిరివ ♦ రమ్మానీకున్. 44

క. బ్రమ్మా యిట్టిది కులగో ♦ బ్రమ్మా కదిలించి చూడ ♦ రామికి నీచి
 బ్రమ్మా జరిపెను సుచరి, బ్రమ్మా సర్వజ్ఞునకు భ ♦ రాజార్ధాంకా. 45

క. దరమాన గాంచియేమం, దరమా తపమునను మదిబె ♦ దరమా మాకై
 దరమా మరల్పగతెమ్మరి, దరమావుత్తులెల్లవినఁగ ♦ దరమారనకే. 46

సీ. అక్షీణ గతిసహ ♦ ప్రాక్షాసు లీరెత్తి, ద్రీక్షణు నుతివచో ♦ లక్షితుఁగ స
 లక్షణంబుగఁ దెల్ప ♦ దక్షయజ్ఞధ్వంసి, రాక్షస శిక్షణ ♦ దక్షవచన
 దీక్షగైకొని వారి ♦ రక్షణాపేక్షియై, తత్క్షణంబున నంచె ♦ ఫక్షమలర
 వక్షస్సు పార్శ్వస్థ ♦ మాక్షితి నీలుఁడై, పక్షిరాడ్ధ్వజుఁ డౌయు ♦ ధోక్షజుఁడుని 47

తే. జాక్షయకృపార్తి తనమును ♦ సాక్షిగాఁగ,
 నక్షనిగ్రహమానసా ♦ ధ్యక్షుఁడై సు
 తీక్షణజ్ఞానకృతదురి ♦ తక్షయగజ,
 రాక్షసునకాక్షణంబ పరి ♦ త్యక్షమయ్యె. 48

వ. అంత గజాసురుండు పరిణమిల్లి.

పంచచామరము.

పురారి! వారిజాసనాది ♦ పూజితాంఘ్రి కంజసత్
కురంగశూలభదరిహస్త ♦ కోవిదాళిసంస్తుతా
ధరేంద్రజామనోనుకూల ♦ దాతవైన నిన్ను నా
తరంబె సన్నుతింప నీశ ♦ దైశ్వరక్షణోత్సుకా. 49

వ. అని వినుతింపఁ బరమేశ్వరుండు కరుణించి వరంబేమని ప్రశంసింప దేవా! తావక పరిభావంబున సర్వంబు దుర్వారంబు, తాము నామవస్నీమ నివాసంబు సేయు గోరిక-ఁయునిన. 50

తే. బోటితోఁ దెల్పకయు చందరి ♦ జూటుఁడాని
శాటుకుక్షిని దూరియ ♦ చ్చోట నొక్క-
యేటి పూటుననుండ న ♦ ప్పాటి తెలక
పాటు లంబడి యగజా వ ♦ ధూటియుండ. 51

తే. ఆస్యమునసుంద రాకృతి ♦ లాస్యమిడగ
దాస్యగతిరేయి తద్బుధ్యు ♦ హాస్యయగుచు
హాస్యమిగురొత్త భవవారి ♦ జాస్యకైర
హాస్యసౌధంబుఁ జొచ్చెఁ న ♦ గస్యయోర్తు. 52

సీ. కనుఁగొనఁగల వారిఁ ♦ గొనగోరున విదుర్పఁ, దనమేనుసోఁకు చం ♦ దంబెయరసి
యూర్పు పెద్దగుచిల్వ ♦ యూర్పుని పంజరం, బులభీతిఁ గొనుశుకం ♦ బులనె చూచి
మెయికాక బెడఁగుగ్ర ♦ మ్మినచాందినులవ్రేలు, పయిరత్నములచిట ♦ చిటలునువిని
చవిసొమ్ము లరగప్ప ♦ చెయిచెక్కునకుఁ జేర్పఁ, దివియుచోఁ గ్రాలుము ♦ ద్రికలె వెతకి
విరహవహ్ని శాంతి ♦ వీజితచేలాంత, చలితదివ్యదీప ♦ కళికలరసి
రాత్రిశయ్యనగజ ♦ రాయిడిగనియిది, హరవియోగజనిత ♦ విరహమనుచు. 53

క. ఏరామ సఖీరామల, గారామునఁ గనదు మేలు ♦ గా! రామలలో
నోరామరో! నారామినో, పోరామాదరి కనవిది ♦ పోరామాటన్. 54

క. నారామిని మీరలుగ, న్నారా మును శుభముఁ జెందె ♦ నారా సిరియు
న్నారా విన్నారా యు, న్నారా యొప్పదును జూచి ♦ నారావేరన్. 55

తే. ఎందుఁ జనినాఁడొ నీకాంతుఁ ♦ డిందు లేఁడు
మందయానరొ దెల్పుమా ♦ చందమనిన
నిందు ధర సుందరీ మణి ♦ యిందుముఖికి
నందముగఁ బల్కె-నెఱుఁగనే ♦ మందు ననుచు. 56

క. కేళిజి తదిక్పతి పుర, పాలీవిభ వాత్మపురని ♦ వసద సురసువ్వా
న్నాళీకాళిగ శంకరు, నాళీతల్లజ మెఱింగి ♦ యాకాళి కనెన్. 57

ఉ. అమ్మరో నీదుభర్త విన ♦ యమ్ము నయమ్ము దలిర్చ దేవ వ
ర్గమ్మునకై యనుగ్రహ ము ♦ ఖమ్మున వాక్యము నమ్మ నెమ్మిదా
నమ్మిడి తత్త్వ సమ్మతి ఘ ♦ నమ్ము నిజమ్మన దైత్యకుక్షి నం
దమ్ము దృఢమ్ము గాఁగ సత ♦ తమ్ము గృహంబుగ నుండె వింటివే. 58

ఉ. ఎక్కడి దంతి దేవరిపుఁ ♦ డెట్టితపం బది యేటికుక్షి దా
నిక్కము దెల్పఁగాఁ బితృవ ♦ నీచరుఁ డాతఁడు వానికేగతిం
దక్కెనె యీలతాంతములు ♦ దక్కెనె యీసుమ మంజరీ లతల్
దక్కెనె యీనికుంజములు ♦ దక్కెనె యీనెలరాల మాడువుల్. 59

సీ. తివిరి నీపతి పూల ♦ తీరు పూగుత్తుల, బారు క్రొన్ననలని ♦ గారు మొగ్గ
గుంపులసౌరు పు ♦ ష్పంపు మాకులకోరు, చాయయొయ్యారు వా ♦ సనలయేరు
పిలాలతలకారు ♦ మేలిక్రపసనంట్ల, ఝోరు కేతకుల బి ♦ డారు కురువ
కప్రసూనాఢ్య శా ♦ ఖా మరుత్తుల హోరు, పొదరిండ్ల చూరు పూ ♦ బొదలయారు
పోక పొన్నల ముక్కారు ♦ పూవుతేరు, మల్లెమొగ్గల చేరు చా ♦ మంతి బీరు
విభవములుగల్గు నివ్వని ♦ విడిచి చనియె, భస్మ లిప్తాంగు నెట్లొంను ♦ భాగ్యరమలు.

ఉ. చందన వాతపోతములు ♦ చల్లఁగ వీచుచువచ్చెఁ దావినిం
దిందరలక్ష్మి యుబ్బుకొని ♦ తీవెల నుయ్యెల లూఁగఁజొచ్చెమా
కందలవంగ కుందములు ♦ క్రన్ననఁ గ్రొన్నన లిచ్చె కిన్నరీ
సుందరగాన మీరెడలఁ ♦ జూడఁగ హెచ్చె ధరాధిపాత్మజా. 61

చ. వనమున నొక్కకొమ్మ గగ ♦ నమ్మును నొక్కలతాళి కొమ్మసం
దునఁ గడుఁజొక్కెఁ గెంపుప్రభ ♦ తో సుమమంజరి సొక్కె దానిచెం
తను మధుపాళి తక్కె వసు ♦ ధాజములం బికమెక్కెఁ బూలవా
సన లటుపొక్కె దర్పకుఁడు ♦ చాపము నెక్కిడి నక్కె నిక్కడన్. 62

ఉ. పెంపులునఁ దేరుమావి గగ ♦ నోన్నతిఁ జేరెడితావి కోరకో
దయమున మీరుకావి వెత ♦ త్రప్రభ గేరెడితీవి చిత్రితం
బయి దగుపూలదీవి కట ♦ కాంచితమా దిగుబావి గల్గు నీ
ట్పొయపరిసేవి యీవనికి ♦ సామ్యము లేవి వనీవిశేషముల్. 63

చ. చెలువపుఁదూడు తేటు సర ♦ సీజసుమంబుల నీటు కేసరం
బుల బలుదీటు సౌరభపుఁ ♦ బుప్పొడి తిప్పల నేటు తమ్మికే

కుల దగు పూటు చూపరకుఁ ♦ గోరిక చ్చెడిచోటు ఈకాలం
కుల వగుపూటు దర్పకుని ♦ గోటుకు వ్రేటుకుఁ జోటు బోటిరో. 64

క. మానుగఁ గూజత్పికసం ♦ తానము వల్లన్నృగివి తానము వితతో
ద్యానము గాయద్భ్రమరీ ♦ గానము వనమిట్టిదెందుఁ ♦ గానము చెలియా. 65

ఉ. కాంతుని మంతనంబు గల ♦ కాంతనటంచు వచింతుఁ దొల్లియో
యింతిరొ యంతలంతలుగ ♦ నెంతయుఁ బోదిది వింత నాకు సా
మంత లతాంత కుంతునిసు ♦ మంత శరాహతి నింతయయ్యెనీ
వంత యనంత మిట్టివల ♦ వంత నెలంత లోకింత రొంతురే. 66

ఉ. చందనగంధి నీమగని ♦ చందము గందును ముందుముందు నీ
యందునఁ గూర్మిఁ జెందు నను ♦ టందుకు సందియమయ్యె నిందయా
నందున కుందు డిందుపడ ♦ నందము నొంద నుతిందనర్చు నీ
సుందరుఁ జెందఁ గోరి సిరి ♦ సుందరుఁ డెందమ మందలం దగన్. 67

ఉ. బాలరో వీలుగా వెతల ♦ పాలుగఁ జేసెఁ గపాలమాలి ని
ర్మలవుగాన లోలుఁడన ♦ వ్రేలెడు కాలునిబోలు నాతఁడి
కాఱలము పూలవిల్తుఁడిసు ♦ గాలము పోలిక జారె నింక గో
పాలుని వ్రోలవ్రెుక్కు మెయి ♦ పాలను దూలను సోల నేటికిన్. 68

ఉ. అండజయాన యానలిన ♦ జాండములు న్దననిండు కుక్షిలో
నుండుఘనుండు కుండలిశ ♦ యుండు నినుండు గనుండ దీనిచే
న్గొండగఁ జూడ కొండుగ ఘ ♦ నుండగు నీదు విభుండు చేరు నీ
దండకు నూనకాండ రణ ♦ తాండవ పండిత వృత్తి నుండగాన్. 69

క. మనగాలి పలుకుచే నే,మనఁగా దా రక్కసుండు ♦ మనగా హరుని
మ్మనగా నాతఁడు నాసా, మ్మనఁగా వెడలింపు వేగ ♦ మనఁగా దగజా. 70

క. కామో సముదుత్తినిచిన, రామో ఘముదారపీడ ♦ రానీదరికి
యేమో సముడుండగ మన, కీమోసము రానదేమి ♦ యొతేఁగింపు చెలీ. 71

క. లలనా దెల్పఁగ గలనా, కలనా కలనాడు బోడమె ♦ కలనారులు నా
కులనారుల నానిల నా, కలనాడెందాన నైన్ని ♦ కల నాకంటుకా. 72

సీ. నమ్మ్రము నమ్మకు ◆ సొమ్మి నీసొమ్మని, వమ్ము నిజమ్ము ని, జమ్ము దమ్ము
గమ్మకు చెపుదు చి ◆ త్రమ్ముగాఁ గలవిన, యమ్ము నయమ్మునఁ ◆ గ్రమ్మనీడు
సొమ్మ్రగ విను బలు ◆ గొమ్మ పొకమ్ము రూ, పమ్మున నీలభూ ◆ తమ్మ్రకందు
అమ్మరో మేటిద ◆ య్యమ్మున గ్రింగఘూ, రమ్ముగ తస్త్రీవ ◆ రమ్ము తమ్ము 73

తే. గ్రమ్మెడు గరమ్ము దైవర ◆ తన్నమ్ము వలన
నిమ్ముగఁ బడసెఁ బతిని సౌ ◆ ఖ్యమ్ము గనఁగ
నమ్మెయిని నమ్మహితవాతఁజ ◆ నమ్మకుంటి
తగ్గిమ్ము గాదిది బొమ్ము స ◆ త్యమ్ము సుమ్ము. 74

తే. దండిగల భూతమరయ వే ◆ దండదాన
వుండు గిరిశుండు మొదటిదే! ◆ వుండు వాని
నిండుగా! నీతఁ గూర్మి రెండు ◆ డొండు చేయూ
చుండు మహి తుండు వారిజా ◆ క్షుం డతండు. 75

సీ. మృదు పదములుగాఁగఁ ◆ జదివెడి నావాక్య, పదవిని వదరుగాఁ ◆ గదురనీక
మదవతి రోయిది ◆ యొదలోనఁ దిరముగ, వదలక మెదలుచుఁ ◆ బొదలి పొదలి
యదియిది యనరాక ◆ కుదురని బలుచింత, బిగ్గిదిలి బ్రిదిలి పోవ ◆ జడిపిజడిపి
చెదరక కదలక ◆ యదయతి ననవిల్తుఁ, డదనైన ములుకులు ◆ గుదుల గుదుల

ఆ. పదిలమై మొదవగ దిమి ◆ యదిమి యదిమి నాట
చెదరి చెదరి చెదరి ◆ యదర నేల
విదిత మదనజనక ◆ పదమది మదినమ్మ
కొదవలెన్న వెతల ◆ జిదుము కన్న. 76

క. క్రిందట నిందుధరుఁడు నీ ◆ యందునఁ జెందెడి సమాఖ్య, లందుదురెపుడున్
కుందరదన నందనవన ◆ సుందర హరిచందన తరు, సుమకేలికలన్. 77

సీ. చెలువుని వలనను ◆ గలిగిన వెలుతులు, వెలయఁగఁ దెలుపరు కలుకు లిలను
జిలుకల కొలికిరో ◆ పలుబలుకుల నన్న, వలదు వలదు కల ◆ విలకొ దొలఁగుఁ
జెలువలదొర తోడ ◆ వల్లభు బలుకు బలుక, విలవిలఁ జెల్లఁగుచు ◆ మెలఁగుచుటలు
కలిగిన యులజడి ◆ వెలుపల నిలుపక, తలుకులు దలముగఁ ◆ గలయ సొలపి. 78

ఆ. పొలయలుకల చెలువుగల ◆ యలయలుకలు
పొలపు మెలపు లరగఁ ◆ దొలగ నలపి

కలుషములకొలికి యొడ ♦ మెలఁగెడి బలియుని
కలిత దయలు గలుగ ♦ నలుక నగునె? 79

సీ. తనియని మనమున ♦ వనజనయన నను, గనుఁగొని యనవినఁ ♦ గనుడు వినుము
వినఁగను గనకను ♦ విననిది కననిది, మునుమును జను జన ♦ మునఁ జననిది
పెనఁగినఁ గొననిది ♦ చనువున మననిది, మినుసిగగలఘను ♦ నెనరుమనుఁగ
ననువుఁగఁ గనికనిఁ యును మునిఁగిన మతి, వినయమునను నుతి ♦ గొనఁగఁ జనునె
చెనఁటి తనము మనఁగ ♦ నెనగన మనికిరై
చనియెఁ జనియెఁ దెలివి ♦ యును మ చెనగొన
వనజనయన మృదుకృ ♦ ప ననయమును మన
గను జనునకు గనిగఁ ♦ గనదె జయము. 80

వ. మఱియు గట్టుపట్టి! నీవిప్పట్టునఁ జెట్టఁబట్టినట్టి దిట్టయొడ గట్టిబెట్టున బుట్టు చిట్టిచిట్టి కట్టలకలచే బిట్టైనకట్టడికట్టు నట్టుపఱచి చుట్టపుతిట్టల కట్టహాసంబు లుట్టిపడ గుట్టుచెడ రట్టునిడ నిట్టిట్టని ముట్టడిపెట్టిన ట్టొక పెట్టున వదరుపట్టకు మీ గుట్టలవలె నున్న వట్టివట్టి తిట్టిమాటలఁ జెవిబెట్టకుమీ చిట్టని చట్టున మిట్టిపడని పాలబొట్టువలె యశోఘట్టనుండగు చట్టువలగొట్టు జెట్టి తోఁబుట్టు పొట్టిబొట్టెడగు పిట్టతట్టురాతు కట్టములిడ పట్టైపుట్టిన పెట్టుచెట్టుగదా కట్టువలుగల పుట్టలవలె కట్టకట్టలగు పాపంబు మెట్టల నొక్కట పెట్టు కొట్టుఁగదా అట్టివాని దయముట్టుకొనిన నెట్టకేల కనక కట్టెదుర గట్టువిల్తుండు దైత్యపొట్టవెడలి నినుముట్టి వట్టంబులేని చుట్టరికంబునఁ బట్టణ సౌధంబున మెట్టాయితాదుల నట్టహాసంబులఁ జుట్టుకొని తట్టుపున్గు నలఁది కుట్టిమంబు లఘట్టించు దట్టంబులగు వజ్రపుపట్టెలుగల పట్టెమంచంబుల వట్టివేళ్ల సురటులులియ పట్టుపట్టంబు గట్టు చుట్టువాలుదాల్పు కట్టకడఁ బుట్టువులీలల నెట్టలేక తేలెదు పట్టపగలి బట్టబయలి తెరువరి కుట్టున క్రేలెదు కట్టగాని బిట్టనవ్వులను తేనెపట్టులఁ గ్రోలెదు ఇట్టిపనికి నెట్టోయనివెట్టనూర్పు నిగుడించి గికురుపెట్ట వలదని మఱియును.

క. సందా వినగందా గన, నందా నీమతికి నవ్వు ♦ నందో ధరణున్
కుందా పొందా సేయిది, కందా నిందానుసీల ♦ కందాఘకదా. 81

తే. ఏర్పడిన దోర్పు మార్పడ ♦ నేర్పరించి, నేర్పు నేర్పున జెందగఁ ♦ గూర్పుచేసి
తీర్పు తార్పును బోకార్పు ♦ దోర్పకమది, నోర్పు కనుమార్పు నట్టార్పు ♦ లార్పవలదు.

క. పగదగ డగదిగ మదిదా, పఁగఁ దగ దొరులకిది సేయ ♦ పగఁ దగ దిలచూ
పగ దగ దోపఁగఁ దగ దా, పగ దగ దెవ్వరికి మాను ♦ పగదగ దబలా. 84

క. నగదగు ధరకనువారి క, నగఁదగు వినువారికి ది ♦ వినగదగు మదినా
నగఁదగు హాస్యముగా నె, న్నగఁదగు గడుమనఁగఁదగు బె ♦ నగఁ దగ దిందున్. 85

తే. కాళితో నిట్లుపల్కి య ♦ య్యాళి చనినఁ, గేళిగతి దక్కి మిగుల వి ♦ రాళిఁ జెంది
యున్న యయ్యుమఁగని దరి ♦ నున్న చెలులు, పలుక నేమియు దోచక ♦ పలికిరిట్లు.

సీ. పూర్ణ చంద్రోదయం♦బున హెచ్చడఁగునన్నఁ బూర్ణచంద్రోదయం♦బున నెహెచ్చెఁ
గుసుమాకరమునఁ ద ♦ క్కువయౌనొకో యన్న గుసుమాకరంబునఁ ♦ గోరి హెచ్చె
బంచబాణరసంబు ♦ నించఁబోవునటన్న, బంచబాణరసంబు ♦ నించ హెచ్చె
మొనయుచుమదనాస్త్ర♦మునను బోవునటన్న, మొనయుచుమదనాస్త్ర♦మునను హెచ్చె
నింమముఖి కుందు సుందరు ♦ లందు నెందు, జెందవీకఁదువలు బోలు ♦ పొందముందు
నిందుధరకుందరదనకు ♦ నిందవయ్యె, బొందుగల మందు లింకేరి ♦ నందుమమ్మ. 87

సీ. ఉదయమార్తాండ చం ♦ ద్రోదయంబు లిడపై, త్యంబు గాదిది విర ♦ హంబు గాని
రావణాస్త్రరసంబు ♦ రామబాణము గూర్ప, జ్వరముగాదిది స్మర ♦ జ్వరము గాని
కాలకంఠరసంబు ♦ కామేశ్వరము గూర్ప, వ్యాధి గాదిది తగ ♦ వాధి గాని
కాలసర్పరసంబు ♦ గరుడరసము గూర్ప, సంధిగాదు మనో వి ♦ సంధిగాని
మెంపుగల యౌషధపుగవ ♦ నొంపుచేసి, గంపుకొని యివ్వఁగా బడ ♦ కుండ నేమొ
దండిగా దీని మాన్ప ఘ ♦ నుండె చూడ, గుండలిశయుండెగాని వే ♦ రొండులేడు.

ఉ. తెమ్మెరపిండు గాంచి సుద ♦ తీమణి వేదన మాన్పుమంచుఁ జి
త్తమ్మున నంటిమా మిగులఁ ♦ దత్పతిభూషణభోగి సంతతుల్
మమ్మశనంబు సేయునిది ♦ మాన్పుదుమే యనుమారు నన్ని
కొల్కొమ్మ మగం డనంగునిగఁ ♦ గూల్చెనిదేటికి మాన్ప నేననున్. 89

సీ. తొంగ గాంచి చలివెత ♦ దొలగించు మంటిమా, లలనాక్షి పైరబ ♦ లంబె చూపుఁ
దమ్ములజెలియవే ♦ దన మాన్పమంటిమా, తరుణీవదన విరో ♦ ధంబె దెలుపుఁ
బూలగుత్తులఁగాంచి ♦ బోటివేదన మాన్పు, మనఁ దకు చవిరోధ♦ మునను గెరలుఁ
జివురుతోఁ జలివెత ♦ చెప్పగా నచ్చెలి, మోవితో నీర్ష్యగా ♦ ముచ్చటించు
గంపు తుమ్మెదగములఁ కు ♦ కములహంస, రాజములఁ గప్పురపుటంట్ల♦రమణి కుందు
వణఁపుమన సాఖిమాచల ♦ జాలకోత్తి, గలిమహోర్వీష్యలను దెల్పి ♦ కలఁకనొందు.

చ. వనరుహనేత్ర కిశ్వ్రతలు ♦ వారివిహారము చేతగాని కాం
తిని గనవంచు నొక్క జల ♦ తీరముఁ జేర్చి జలంబులో సఖుల్
కనకలతాంగి ముంప సఖి ♦ కాయ మహా విరహాగ్ని చేత నం
త నుడుకునొందె నజ్జలము ♦ తంద్రిగుణంబును బూనెనోయనన్ 91

సీ. పోరి కోకములు కా ♦ సారంబువెడలెఁ గా, సారజంబు లడంగె ♦ నీరమునను
మీఱె శైవాలంబు ♦ క్రీరంబు జేరె న, వారితంబుగ వారి ♦ దూఁగె మీలు
దోరి కూర్మము లధో ♦ ధారుణిఁ జొరబాఱెఁ, జేరుప నక్రముల్ ♦ గోరిదారె
వారలకై బిస ♦ వారంబు దాఁజేగె, ఘోరాహులడరి చె ♦ న్నారె నవియు
నారి కుచ ముఖ కచ నయ ♦ నోరు పాద, చారు మకరీ భుజజటాగ్ర ♦ కారసామ్య
మోరువఁగలేక కాంబోలుఁ బాఱె నిట్లు, సారసానన జలకేళి ♦ వేరుగాదె.

తే. అతనుఁడు ప్రభంజనుండు దో ♦ పాకరుండు, ధరజ కార్యంబు సేయమి ♦ ధర్మమాను
శీత గంధాదికంబులు ♦ చెలియమేన, శీతలము సేయకుండుట ♦ చిత్రమరిది.

వ. అని యని.

క. ఘన వాగ్వైభవతరివర, మున శ్రీశకథాబ్ధి మునుఁగు ♦ మునులను నూతుం
డను నౌపతి పశ్చాత్కథ, !యను జలనిధిఁ బ్రాకథాని ♦ లాహతి ముంచెన్.

క. శ్రీమ తొకమరపురీవర, ధామా దానవవిరామ ♦ ధరభిద్రత్న
శ్యామా వేదశిరోనుత, గోమా రిపు భీమ జేణు ♦ గోపాలహరీ.

పంచచామరం.

పతంగ చంద్ర నేత్ర సర్వ ♦ పావనా సురావవా
మతంగ జార్తి కారి నక్ర ♦ మర్దనా జనార్దనా
సతాహితస్తు తిప్రకార ♦ శారదా మణీరదా
యతీశ వంద్యమాన సత్ప ♦ దంబుజా ద్విజధ్వజా. 96

మ. జగదుత్పత్తి నిదాన దాన గజర ♦ క్షాదక్ష దక్షఘ్న మ
స్తగపాదాంబుజతీర్థ తీర్థవృతన ♦ ష్టప్రాణ పుత్రప్రదా
నగరిస్థాత్మ విశేషశేషముఖ ♦ నానానిత్య ముక్తోపభో
గ్య గుణస్తోమ నివాస వాసవ మణి ♦ శ్యామాంగ మాంగాంచితా. 97

గద్యపద్యము.

మ. ప్రథిత ప్రాభవ కాశ్యపాన్వయ సుధా • పాథోధి రాకాకళా
నిధి నారాయణ సూరిరా ట్రచిత ని • ర్నిద్రాబ్జ పాళీగళ
న్మధుధారోక్తి గణోదయాభినమహా • మంజు ప్రబంధంబునన్
బ్రథమాశ్వాస మిదీక్షమాతలమునం • బ్రఖ్యాతమై యొప్పెడిన్. 98

శ్రీ శ్రీ శ్రీ





శ్రీమద్గురుభ్యోనమః.

# గణోదయము.

## ద్వితీయాశ్వాసము.

క. శమిత మహాసురజాలా ♦ రమణీయ గుణాలవాల ♦ రాజిత లీలా
నమితజన విలయకాలా ♦ కొమర పురీపాల వేణు ♦ గోపాల హరీ. 1

వ. అవధరింపుము. 2

తే. సూనశర సూనశరబాధ ♦ మానవతులు
గ్లాని పూనంగ నాటలో ♦ కానలలని
మానుపుదురని పోదాయె ♦ మానవతిని
బూని గొనిపోద మింకను ♦ ద్యానవనికి. 3

క. ఈ వెలఁదికి వనమునఁగల ♦ తీవెల పొదరిండ్లఁ బూల ♦ తిన్నెల నవలా
ప్రోవుల మావుల పుప్పొడి ♦ తావులనుం జూప వెతలు ♦ దరుగవె తెలియన్.

వ. అని. 5

క. బలువెతలఁ దలఁకునగజను ♦ జెలులత్తఱిఁ దోటలోన ♦ జేరిచి యప్పూ
వ్వులు చూపించిన వెతల ♦ గ్గలమయ్యెం బూలు కామ ♦ కాండములౌటన్. 6

క. అగజకు విరహం బెచ్చఁగ ♦ నిగురులు మొగ్గలును దోడి ♦ యింతులు గోయన్
బెగడొందె దర్పకునకవి ♦ యగుఁ గత్తులునుం గటారు ♦ లనిబలు వెతలన్. 7

రగడ. ఇంతి కురవకమ్ము గాంచి ♦ యెంత యడలె విరుల మించి
కాంత మదిని వెతలొనర్చు ♦ కాలమాటబగఁ దనర్చు
చామ యాశీషములను ♦ సరస బోవదు కలగిలను
లేమ తనువే పుండ్రమొందు ♦ లీలఁ జెంది భీతినొందు
పూలరజము కొప్పుపైని ♦ ఘూరిగతులరాలఁబూని
బాల మరుతుపాకిమందు ♦ భ్రాంతినొంది మిగులఁ గుందు

తీగెగములు సొగసుబారు • దెరలి శైవలిమాచు మారు
తూఁగుటుయ్యల లనిమిగులఁ • దోయజాక్షి వగపు దగుల
మేడనున్న చెలిని వేగ • మించితోట లోకిఁ దేగ
గూడె నిచట నధికమగుచుఁ • గువలయాక్షి చెలులు దగుచు
నెంచి యవిటికంట మందు • లిడిన దానివలన ముందు
మంచికన్ను పోయినట్లు • మగువ చెలులు హెచ్చెనిట్లు. 8

సీ. పల్లవాధర స్మర • బాణంబులని విరు, ల్గోయబోఁ దికములు • గూయజడిసెఁ
గోకిలఁ దోలంగఁ • గుండలి వేణియుం, బర్హినాదము రాఁగ • బడలుపడియె
బర్హిని భీతిచేఁ • బట్టంగ బిసబాహ, హంసలఁ గనుఁగొని • యడలు గొనియె
హంసలఁ జోపఁబో • నడరి బింబాధర, శుకములఁ గనిభీతి • సొక్కియుండెఁ
బాటలాధర వేదన • బూటుచెంద, మాటుపడఁజేయఁ జూచిన • బోటులమొద
మాటిమాటికి వేదన • పాటికెక్కె, మేటి సెగకు సమ్మెటపెట్లు • సాటిగాద. 9

వ. అంత. 10

క. నగకన్నియ కిపేదన • తగనిది పొడచూపెఁ జూడఁ • దగదని వేచే
నగమిగులఁగఁ దానరిగెఁ జ • నఁగఁ దొగలవిరోధి యపర • నగ[illegible]నకరిగెన్. 11

క. దీపంబు లింద్లఁగాంచెను • వ్యాపించెను దార లరుణ • మాకా[illegible] ధరన్
దీపించెఁ దిమిరతతులు వి • లాపించెను జక్రములు క • లవరు[illegible]నించెన్. 12

తే. రాత్రి రాజ్యంబు నేలఁగ • రతివిభునకుఁ, జేయుచున్నట్టి పట్టాభి • షేకవేళ
వేల్పు లెత్తిన ముత్యాల • వెల్లగొడుగు, నోజఁ దగెఁ జంద్రమండలం • బుదయగిరిని.

సీ. కొమ్మలకై మేలి • సొమ్ములకై పోవు, జారచోరులకిది • మాఱుతల్లి
తముఁబాసి పతులన్య • తరుణులఁ జెందినఁ, గనలొందు సతులకుఁ • గన్నమాత
జారిణీ జారులఁ • గూర్పమదిఁగోరి, మెలఁగు దూతికలకు మృత్యు రాత్రి
యొక్కొల నెక్కుడు • రొక్కము గలిగిన, పెనుధని కాళికిఁ • బెండ్లివేళ
పణ్య రమణీజనని మనో • భయ విధాయి, పనులఁ జరియించు వారికి • భాగ్యలక్ష్మి
హీన దీపాలయులకు ల • క్ష్మీనిధాన, మగుచు జాబిల్లి వెలుఁగప్పు • డతిశయిల్లె. 14

వ. ఇవ్విధంబున నచండకర కరపిచండిల కామదీమండలంబు లొండొండ సముద్దండ తం
డంబులై కాంతికరండంబులై చెంపుపడి గంపుమిగిలి నింపుగొని కుండల్యాఖండల

ఘోషణుండైన చండీశుండున్ను వెండికొండ పెండువలె నఖండంబులై మెండుకొని
యండజవాహనుండైన పుండరీకాక్షుండున్ను పయోనిధి వీచికాండంబులనఁ గుండలుల
భాతి వేదండంబులకరణిఁ గోదండంబులవలెఁ దుండంబులవడువున గండభేరండంబుల
పగిది గండశిలలకై వడిఁ దరులనీడల దండగల కాంతిషండంబులతో దైత్య గర్భస్థుఁ
డౌట భర్గు శిరంబున నిముడక యొండుమై యుఱికి తెందుకొని డిండీకారంబులతోఁ
కైలాస నగము దండకై గండుకైదువదాల్పు పాపయును మెండుగా నాపైనుండు
దైవాఖండలుండగు నాగాభరణుం డొండొకచోట జెందుపడెనో యని యతని కై
కైలాసంబు నన్యోన్యంబు దిండుదిరుగు చందంబున బ్రహ్మాండ భాండంబు నలమి నిగ
నిగమను నగుమొగంబుల జిగిబిగిమిగుల సొగసుగులుకు ముగుదగములు మగలకై తగిన
యెడలకరుగు తఱి ధగధగమను వెన్నెల గములలో నగులు బొగులునఁ జను మగుడ
ల దూతికలని గణింపఁ దగరని మిగులవగలఁ బొగిలి యసువులు దెగడి వియోగంబు
దగల నిగిరియిగిరి మరల నిగమంబులకుఁ జను యూనజార మానినులును వాటంబైన
వెన్నెలల జాటలలో కాటనధ్వజాని వేళల మాటుపడి లోటుచెందిన నిందిరాపాట
వంబున బోటులతో కూటంబులు నేటుకొనమింజేసి కైటభారిం దూరు వృద్ధజార పు
రుషకోటులును మదనువెతలఁబడి యదనైన వృద్ధత్వంబని యెఱుంగక కచంబుల పలి
తంపు బుష్టికి కుచంబుల నష్టికి జారతాప్రసంగంబు నిర్దిష్టికి కించిద్దృశ్యమాన దృష్టికి
తనువికంపన సృష్టికి విటసంయోగాభావ స్పృష్టికి నిశాపతి ఘృష్టికి వగచు వృద్ధజా
రిణులును శశధరత్వంబులు ద్విజరాజత్వంబునుం గలుగు నిన్నుఁగనువారి కార్శ్యంబేరీ
తి నౌనని తారాపతి నిందించు దూతికా పారసాత్కులునుం గలిగి విటవిటీ మనోభి
మంబై వికాసధామంబై యున్న సమయంబున. 15

క. నగరాజ తనయ దివిభువి, నగణిత ధవళప్రభామ • యంబగు జ్యోత్స్న
న్మిగులఁ బ్రకాశమునఁ దనరు, మృగధాముని గాంచి బలుక • మిన్ వెతనొందెన్.

క. అంతం జంద్రాశ్రిత భా, త్యంత క్లాంతాద్రి సంధ • వానన రుచిదా
నెంతేఁ గనుఁగొని యందొక, యింతినుతులఁ గుముదవిభుని • నిట్లని పలికెన్. 17

తే. వసువులు కళలు గల్గు న • వారితముగ, రాజవే కావు రాజాధి • రాజవీవు
హరికి బావవు క్షీరాబ్ధి • కాత్మజుడవు, సిరికిఁ దోబుట్టు వహహా! వి • శేషమిది.

సీ. కువలయంబు ప్రకాశ్తి • గొనునె నిన్ననకున్న, నీవెల్గు లేకున్న • నిఖిలమునకుఁ
జీకటి పోవునే • తొలఁగి నీకరముల, నీకున్నను జకోర • మెటు బ్రతుకురా!

నిన్నుఁ గాంచక యున్న • నీరధి పొంగునే, నీ ప్రకాశించునే • నీవు లేక
యాహ్లాద కరుఁడని • యనరె నిన్లోకంబు, లతనునకు సహాయ • మాదుగాదె
వలువ జనముల కిడిన యు • న్నంబు వలన, మరణమును జేసె వారిక • మర్త్యకోటి
నీసుధను దిని జరమృతిఁ • బాపి రనఁగ, దాని జేత హెచ్చె శశియని • రీసు మిగిలి. 19

తే. కింకచేఁ బంకజాక్షుల • పొంక మణఁచి, కొంకకను బింక మొప్ప వి • శంకటగతి
వంకిలిగ వంకరలు వేయు • టొంకువగుదు, శంక నీకింక లేదు శ • శాంక చూడ. 20

క. భూతేశ శిరోమణి వ • క్రాతి భయాపాది విషధ • రాధ్వగమన వి
ఖ్యాతి కుముదాప్త నీవిప, రీత ప్రథఁ జూచి మెత్తు • రే పద్మాక్షుల్. 21

క. క్రమముగ నమృతాఖ్య ఫణివి, షమునకు దుత్తారమునకు • స్వర్ణద్రుమనా
మము మీలక నిమిషాఖ్యయుఁ, గ్రమసతులకొనర్చు నీకుఁ • జంద్రాఖ్యతగన్. 22

క. వేరొక సతి శశిఁబలికెను, సారస జాన్నమునఁ బ్రజలు • సప్రజాలు భవ
త్సార సుధాన్నము గొను సుర, లారూఢిగ నప్రజాలు మ • హాత్ముఁడ వెకదా. 23

ఆ. మరుఁడు హరికొమరుఁడు • మంజుల కుసుమ తో
మరుఁడు విటసమరుఁడు • మార్విక్రుద్ధ్భ
మరుఁడు సోమరుసు వి • మానత సన్నుతా
మరుఁడు గల్గ వేర • మాటలేల. 24

సీ. భువి పుణ్యకాలమై • పొలుపొందె మకరంబు, నీధ్వజ విఖ్యాతి • నేర్పదేమొ
భర్గుని తలకెక్కఁ • బద్మారి నీదగు, మాతుల సామర్థ్య • మహిమ యేమొ
కవికి నుచ్చగృహంబు • గానయ్యె మీనంబు, నీకేతనఖ్యాతి • సోకనేమొ
రామ స్మరణచేత • రంజిల్లె శుకములు, నీరథం బైనట్టి • మేరయేమొ
యట్టి మకరేందు మీన శు • కాళి మగువ, నక్ర భూషానవ సుశేత్ర • నవ్యవాక్య
భూరిమిత్రి తగఁ జెలిఁ • బోరివేర, వీరనగధీర లక్ష్మీశ • మార మార. 25

తే. పూలపాగా తలను దేరఁ • బూలదండ,
మెడను బొలుపారఁ గవచంబుఁ • దొడిఁగి మీర
వడలు నినుఁ జేర నీబోటి • కలఁగె నార
మనుప విడిరయెర లక్ష్మీశ • మారమార, 26

